# గుంట గుడిసై

## 31. తత్వముం

1. గుంట గుడిసై యున్నాది దాని కూటం, అంటి అంటక నిండీస దాని వాటం, గుంట గుడిసై యున్నది దాని కూటం, పడితే పండేను, చెడితే కుండేను, వాడితే మట్టేను ఖూడిదపాలవును ॥గుంట గుడిసై॥
2. మట్టిదేహం తనువ్రాకి తగూలాటం, ముట్టుకుండా నీటీబుగ్గ వాటం, ఘట్టిగా యీగుట్టు వట్టిదని చేపట్టి, నట్టేటిలో ఫ్రట్టికయినట్టి యీ కట్టె ॥గుంట గుడిసై॥
3. శృష్టి నష్టం తెలసినవారి కిష్టం, యీష్టపడినవారికి దాని స్పష్టం, అష్టాగతి నాట్టి, కష్టించి, యిదివట్టి నష్టం, యీ కష్టములే, శ్రుష్టే లేదని కొట్టై ॥గుంట గుడిసై॥
4. మాట లేకను యున్నదాని బాట, నాటినుండి యున్న దానిమీాట, వాటము కవాటము త్రికూటస్తానము బాట్టి, మూటీ కెగువను యున్న నాతిని తాచేబట్టి ॥గుంట గుడిసై॥
5. యిష్టాపడినవారికి చాల నష్టం, నష్టప్రుష్టలు రెండూ తనకా యిష్టం, మొట్టమొదటే తన గుట్టూ దెలసుకుంటె, యిష్టంతా నష్టమాని, కష్టం లేకను పట్టె ॥గుంట గుడిసై॥
6. ఘట్టీ గురుని పాదము చేతబాట్టి, నేట్టనెట్టి తన నెత్తిమీాద బేట్టి, గుట్టు దెల్పుమాని, పట్టితిని పాదమున, నట్టేటిలో పుట్టి ముంచి నాట్టి నాట్టి యీ కట్టె ॥గుంట గుడిసై॥
7. యీస్టూడై గురుని కరుణ గోరినట్టి, నాష్టాపుష్టలు గురుపాదమందు బెట్టి, కష్టించి బొబ్బిలి జేరి కష్టపడి, గురుని గని, నష్టాపుష్టలు గురుని కర్పణ రాజియదాను ॥గుంట గుడిసై॥



# తేయాకై నదీ

## 32. తత్వము

1. తయ్యాకై నదీ చిన్నదిరా, బస్ తమాషగున్న పదపదర, తయాసుటీర్ మెల్, బటాగురు, బల్ బటాదు బయనై యున్నదిర, ॥తయ్యాకై నదీ చిన్నదిరా॥.
2. యిూమాజోషూ లేకున్నదిర, అది జోడుకు యిూడై తగినదిర, తగిన వారికిది, సూపరిరా, అది సూపరి మనకే తగినదిర, ॥తయ్యాకై నదీ చిన్నదిర॥.
3. రాకలు పోకట లేనిదిరా అది రవ్వంతైనను, మెరుగదుర, రాకట పోకట లుండిన వారిని, రమ్మంటున్నది పదపదర ॥తయ్యాకై నదీ చిన్నదిర॥
4. తల్లిదండ్రులు లేనిదిర, తలవాకిలిపై తానున్నదిర, నేనొంటిగా కున్నదిరా,ఆయిదుగురు బిడ్డలూ అన్నదిర, ॥తయ్యాకై నదీచిన్నదిర॥.
5. మేడలు మిద్దెలు లేనిదిర, అది మోహాము చేతను, యున్నదిర చూపరుకు యవ్వన కాంతిదిర మన మోహాంబంతయు దీర్చునుర, ॥తయ్యాకై నదీ చిన్నదిర॥
6. అన్నపానములు లేనిదిర, అది ఆది విరాట్టై యున్నదిర, తనకే దిక్కెక్కను లేనిదిర, మన మక్కడ కెల్లి పోదుముర, ॥తయ్యాకై నదీ చిన్నదిర॥
7. సత్యము దప్పక నిలిచెనుర, అది సర్వము తానై యున్నదిర, భక్తుల హృదయము గన్నదిర రారమ్మని బిలుచూ, చున్నదిరా తయ్యాకై న చిన్నదిర॥.
8. మేను త్రక్కనా మెరుపుతీగెర, మేడ లోపలా యున్నదిర, తొమ్మిది కిటికీలుగా, తోల్ బొమ్మలా నాట్యము జేసునుర ॥తయ్యాకై నదీ చిన్నదిర॥
9. మేపసిఖరి మందున్నదిరా, అది ముక్తికి తోవాని జెలియునుర, నాభక్తుడు నాలో గలయునుర రాజయ్యదాసు నిట రమ్మనుర, తయ్యాకై నదీ చిన్నదిర॥.



# వసంత క్రీ కాంత

## 33. తత్వము

1. చిన్నదానా నామీద దయాలుంచుమా, చిన్నదానా నామీద, పెద్దదానా నామీద నీప్రేమలుంచుమా, పెద్దదానా నామీద నీ ప్రేమలుంచుమ, చిన్నాపెద్దా యేకాంబైతే యేమీ లేదట, యేమీ లేదని తెలుసుకున్నది మూఢము నీవాటే, చిన్నదానా నామీద ॥దయలుంచుమా॥

2. చిన్నదానా నామాట నీపేరు యేమిటే, పెద్దదానా నామాట పెసుభూతముగాదటే, చిన్నాపెద్దా, యేకాంబైనా బాట కనిపెట్టె నిన్ను నన్ను గన్నవాడు నీలో నున్నాడే, చిన్నదానా నామాట, ॥నీ పేరు యేమిటే॥

3. చిన్నదానా నీవూరు నీపల్లి యెక్కడే, పెద్దదానా నావూరు బయలందు గాదటె గర్భగుంటలోను నీకు వూరికి రాదటే గుంట దాటితే బయలు యందున, పంటగాదటే, చిన్నదానా నామీద ॥ప్రేమాలుంచుమా॥

4. చిన్నదానా నీతల్లిదండ్రి యెవ్వరే, పెద్దదానా నా తల్లి నా తండ్రి యెవరటే, తల్లిదండ్రి లిరువురు సంసుపిల్లోనీవాటే, తల్లీపిల్లా, పిల్లేతల్లి, వున్నది బయలటే, ॥చిన్నదానా నామీద॥

5. చిన్నదానా నియత్తా నీమావ లెవ్వరే, పెద్దదానా నాయత్తా నా భర్తలుగారటే, బక్తి యెరిగిన వారికి నీవు భార్యవుగాదటే, బక్తిమీరినవాడు నాకు భర్తగాడటే, పెద్దదానా నామీదా ॥ప్రేమాలుంచుమా॥

6. చిన్నదానా నీభర్తకు నీకు కలియుటెప్పుడే, పెద్దదానా నాభర్త నన్ను వదలి యుండడే నీభర్త నిన్ను వదలనప్పుడు బోదయెవరికే, బోదలేని సాదువులకు బోదగాదటే, పెద్దదానా నా మీద ॥ప్రేమాలుంచుమా॥

7. చిన్నదానానీగర్భమందుబిడ్డలెందరేపంచభూతములైదునాకు,బిడ్డలు గాకేను. ఐదు ఐదు యిరువైయైదు, తత్వమందవే, తత్వమెరిగిన ఆడదానా, ఆటగాడవె, పెద్దదానా నామీద ॥ప్రేమలుంచుమా॥

8. చిన్నదానా నీమూలమేదో, నిజము దెల్పుము ... పెద్దదానా నామూలము నాకు తెలియకున్నదా, నీవు వోచ్చే కారణంబు నిజము దెల్పుము, రామూర్తి గురుపాదములానునమ్మి నమ్మివస్తినే, పెద్దదానా నామీద ॥ప్రేమలుంచుమా॥

9. చిన్నదానా బొబ్బిలి పురము జూచినావా వె, పెద్దదానా తయార్ మేల్ బాగాయున్నదే తిన్నుతానుగన్న రాజయదాసుని జూడవే, నిన్ను పుట్టిన్న గన్నవాడని, ముద్దు గెడితనే, పెద్దదానా నామీద ॥ప్రేమలుంచుమా॥



# ముక్తి కాంత

## 34. తత్వము

1. చిన్నదిర నిను గన్నదిరా నిను రమ్మని నాతో చెప్పిపంపినదిరా కన్న గిటంపులసి మదిలో, నెప్పుడు, నిన్ను దలంచుచున్నదిర, ॥చిన్నదిర॥

2. సపరిగా పరిపూర్ణముర, అది మాపులేకనూ యున్నదిర, యేపు లేకనూ, వెలుగుచున్నది. ॥చిన్నదిర॥

3. మాపులేక, సీదాపదిర, చిన్నదిరా నిను గన్నదిర పుట్టుదుర అది గిట్టదుర, అది చూపుకు ఆవాలే వున్నదిర, పుట్టి గిడ్డిటాడ్నిడిగి తెలిసితే, అవలవున్న బయులదిర ॥చిన్నదిర॥

4. కనలనుర అది సుసలనుర, అది కంటిలో వాపై యున్నదిర, కంటికి కంటికి, ఒంటి టి సందులో కనబడుచున్నది కలియుముర ॥చిన్నదిర॥

5. కలసి కలియక కాలకాలములు, కలియకనున్నది, కలియుముర, నిలచి నీమనసుమొనసి వక్కటిగ జేసిన రాజయదాసుడుర, ॥చిన్నదిర నిను నన్నదిర॥



# ఆహోవయ్యారి

## 35. తత్వము

1. ఆహోవయ్యారి చిన్నది, యీ చిన్నదాయి చిత్రమైన మేడలున్నది.
ఆహోవయ్యారి చిన్న చిత్రమైన మేడలున్నది, తొలుకొంలోను
యున్న, తొంగి తొంగి జూచుచున్న ॥ఆహోవయ్యారి॥

2. చీకటెప్పుడు లేని కొంపది, ఈ చిన్నదాయి సరస మెరిగి జాడగన్నది,
చీకటెప్పుడు లేని కొంపది, సరసమెరిగి జాడగన్నది, జాడగన్న
నూపరెంటికి జాబురాసి పంపుచున్నది. ॥ఆహోవయ్యారి॥

3. మేరుశిఖరమందు యున్నది, యీ చిన్నదాయి, మేడ పక్కన
గూరుచున్నది, యెరుపు, తెలుపు, నలుపు, దుప్పటి, నాణ్యముగను
గప్పుకున్నది, ॥ఆహోవయ్యారి॥

4. దశవిదంబు నాదయందున, యీ చిన్నదాయి, వాపుజేరి పవ్వళించిన
దశవిదంబిల నాదమందు, దాపుజేరి పవ్వళించి, వీనులకింపగునట్టి
సుద్దులు పెద్దలు విన్నది ॥ఆహోవయ్యారి॥

5. భక్తులు హృదముగన్నది, యీ చిన్నదాయీ, రామమూర్తిని
వేడుమన్నది, బొబ్బిలి పురమందంతట విరివిగ వెలసిందంతట,
కదళీపత్రపు రాజయ్యను, గనుగొన్నది, మరి విన్నది ॥ఆహో
వయ్యారి చిన్నది॥.



# యేపూరం చిన్నదా

## 36. తత్వము

1. యేవూరు చిన్నదా నెందుకొస్తివే నివు యేవూరు యేపల్లి వెళ్లి పోతావే, గుంటలూరు మెట్టమీద, తిండిగత్తినే నేను, వంటిగత్తె నుండ లేక మింటజేరెనే, నాతోటి రారెవారు సరిసాటి మీసముయె గాదు వ్వోటి. రోసాను నాతో సాటి యీపాటి, యీకోటి, జన్మోటి భావించు కోటి. ॥యేవూరు చినదా నెందుకొస్తివే॥

2. యేవూరు చిన్నదా నెక్కడుంటివే నీవు, మాయలాడి బొమ్మలోను, మాటలంటివె, మాయలేదు, మబ్బులేదు మర్మమంటినే నేను, మర్మమెరుగ కున్నవాన్ని మబ్బుజేస్తివే నేనువిన్న, నను నమ్మనందు నన్న, యీ తోవ దొరకదన్న. యిది నిశ్చయించుకున్నా, అన్నా నీకు నాయందు దయలున్నా, యిక తిరుగు లేదురన్నా ॥యేవూరు॥

3. యేవూరు అత్తవారు లెక్కడుంటిరే, నీకు పంచభూత సాక్షిగాను పెళ్లి జేస్తిరే, అత్తగారు మావగారు, అష్టదళమటే నీక యిష్టమైన మొగుడునోరికె, భక్తుడేనటె, భర్తానీపాలుబడితిని, హర్తా, నాయుక్తికి నీవే కర్త, వైకుంటంబొక్కటి కోర్తా హర్తావే, భర్తావే కర్తావే, భోక్తావే ॥యేవూరు॥

4. యేవూరు చిన్నదా నెందరు బిడ్డలే, నీకు, బిడ్డలైదుగురున్నారంటె వద్దానెవ్వరే, ఐదు, ఐదు నిరువై ఐదు బిడ్డాలందరూ నాకు, బిడ్డలు లేక వంటిగత్తె నాళ్లిపోతానే, త్సాలూ, త్సాలించు మాటలు మాను, నే చెప్పిన మాటలు వూను, నీకింక కష్టమనే, మాట విన్నా, మరుగదన్నా సూటదన్నా-చూపదన్నా- ॥యేవూరు॥

5. వూరులేక పల్లిలేక చిన్నవాడ, నాకు మాయలేక మబ్బులేక చిన్నవాడ, నీవు వొచ్చే కారణం చూచినదానా, చక్కగాను, గుట్టుదెల్పు చిన్నాన, మానా నాపేరు జెప్పతానా, రామమూర్తి అన్న, రాజియ్యదాసుకు నేనా, ముక్తికే మూలమూని ముదిత అనే చిన్నదాన్ని ॥యేవూరు చిన్నదా నెందుకొస్తివే॥ 

# ఏకాపూర్ణమా

## 37. తత్త్వము

1. ఏకాపూర్ణమా – సాకారములో, నిరాకార, ఏకాపూర్ణమా,
యిక దెలసేనే నీ మహిమ, సకాలము నీకే ప్రేమ, అగణిత
సర్వాబామ, నీకేనా మనవి వినుమ ॥ఏకాపూర్ణమా॥

2. లోకాపావనం – (శ్రీ)కార సాకారమంత, లోకాపావనం, రాకట
పోకట నున్నా, యేకము వక్కటిరన్న, నిక్కము పూర్ణమిదన్న,
వక్కటి నిజమోయన్న ॥ఏకాపూర్ణమా॥

3. సందూలేదన్న, అందూ యిందూ అంతాట నుంది, సందూలేదన్న
యిందుకు సందేహము లేమ, పొందిన వారికి వదలే సందా
నందము వదలే, అందరు మొసగరు సరిలే, ॥ఏకాపూర్ణమా॥

4. నిర్వికారమా, యుర్విలోను, సర్వాత్మతాను, నిర్వికారమా
సర్వము తానై యున్న, గర్వము లేదోయన్న, నిర్వాహించియున్న
యుర్వి పంచమునున్న ॥ఏకాపూర్ణమా॥

5. రూపూ లేదన్న, యేపూ లేక రూపె లేదు, రూపూ లేదన్న, కోపము
తాపము సున్న, రూపులు యేపులుమన్న, దాపై యున్నదిరన్న,
తప్పక నిజమోయన్న, ॥ఏకాపూర్ణమా॥

6. పుట్టబోదన్న, వట్టీదీ, ఘట్టిదై యున్న, పుట్టబోదన్న, పుట్టదు గిట్టదురన్న,
ముట్టుకు మూలమిదన్న, నట్టానడుమునున్నా, పెట్టదుర, పెద్దన్న
పుట్టబోదన్న. వట్టీది గట్టిదై యున్న ॥ఏకాపూర్ణమా॥

7. వుత్తాబయలన్న, మస్తూలకెల్ల, సత్యాముసున్న, వుత్తాబయలన్న,
వుత్తదిత్నత్తైయున్నా, త్సత్తజీవుడురన్న, మొత్తామిదంతసున్నా,
వుత్తది నిజమోరన్న ॥ఏకాపూర్ణమా॥

8. యేమిగాదది, నమ్మినవాని సోమ్మైయుంది యేమిగాదది, అమ్మ యిమ్మహిలోను సమ్మతించి, నాలోను రమ్యావరమిమ్మనెనే యిమ్యానా ప్రాప్తమనెను ॥ఏకాపూర్ణమా॥

9. బొబ్బిలిలంచున, ఆబ్బానాదానిమబ్బులెదు, బొబ్బిలందున, అబ్బా రామమూర్తిని, గొబ్బున నేగనుగొన్నను, దబ్బర లేకను గురుబో దిబ్బిన రాజియదాసుని ॥ఏకాపూర్ణమా॥



# నేనే లంజనుర

## 48. తత్త్వము

1. నేనేలంజనుర, నన్‌గన్నానాదుడుర, నేనేలంజనుర, నావిన్నప మాలకించినవారులేరా ॥నేనేలంజనుర॥

2. యెన్నో జన్మంబులు, వచ్చిపోయినగాని, నన్నూ జూచినవాడు, నానాదుడు, నేనున్నాస్థలము తాను గన్నాడతడు, నన్నుమననామ జేసినాడు, నాసన్నబిలము కావలున్నతడు, యెన్నో యుక్తులు పన్ని కన్నావారిని బట్టినన్ను పెండ్లాడినా, నా నాదునకు, నేనే లంజనుర, నన్‌గన్నా నాదుడురా ॥నేనే లంజనుర॥

3. రేడు కొండలు పైని, జోడు పక్షులు పట్టి, దీరుపైయున్నాడు నానాదుడు, పండుపండు వెన్నెలలోను నానాదుడు, గుడికిరండి కట్టినాడు నానాదుడు, గుడియేడావడి వీధిలో నానాదుడు. నడి కుప్పమీదను సక్కకూతకొట్టి, గుడిచట్టూ దీపాలు, గుడిలున్నా నానాదునకు, నేనే లంజనుర, నన్‌గన్నా నాదుడురా ॥నేనే లంజనుర॥

4. అన్నామాటలు తనకెన్నడు–లేదుకాని, మన్నారన్న జేసిన మెప్పు పతడు, యిలను చిన్నెలుకాని ప్రసన్నాతడు–కన్నవారిని కడుపున గన్నాతడు తన్నుగన్న వాడిలయందు దాతా వాడు, విన్నవారు వారులేక, కన్నవారులేక, సన్నాదరించినా, నానాదునకు నేనే ॥నేనే లంజనుర॥

5. యింటిలోపల, త్రాసెలా తంటాలుబెట్టిన, మింటా జంగపువాడ్నీ, జూచెనుర, పాడుముండాను వాడెంట దిరిగేనుర, నాటినేటికైనా నన్ను విడువాదుర, జోడు బాయకుండగ మేము తిరిగేముర, మూటీకి యెగువాను, కూటస్థుడైతాను, మేటీ దొరకు నేను మాటిచ్చి యున్నాను, ॥నేనే లంజనుర॥ నన్‌గన్నా నాదుడుర॥

6. యేడేడూలోకములు యేకరీతిగ మేము, నాటీకి నేటీకి యేలేముర, యీడుజోడు మేమెడబాయకున్నాముర, రెండు మూడు ఐదింటీలో యున్నాముర, యేడు మెట్లపైనున్నది నాగుట్టుర, దిట్టాముతో తనగుట్టూ దెలాసీన, బట్టబయటను నేను, నిట్టానైయున్నాను, ॥నేనే లంజనుర॥

7. నిబ్బరముగ రామమూర్తి పాదముబట్టి, అబ్బిన రాజయ్యదాసనాడు వారు బొబ్బిలిలో జన్మనీవాసముర, యిది అబ్బినవారికి జెప్పేరుర, మబ్బువడలించి యిది మీకు జూపేర మూటీకి యెగువాను, మూలమైయున్నాడు నాటీకి నేటీకి నానాదునకు నేను ॥నేనే లంజనుర॥



## దాసోహం

## 39. తత్త్వము

1. దాసోహం దాసోహం పెద్దలకు నా దాసోహం సుద్దులకు నా దాసోహం దాసోహం దాసోహం.

2. దాసోహం. యాని మోసామైపోయ్యారు, కాసాకు కొరగాని దాసాలమా యీశునికృపయాని, బూసురులందరు, దోసిళ్లొగ్గి తెస్నాగానాకపోయేరు, దాసోహం దాసోహం పెద్దలకు, నా ॥దాసోహం॥

3. వాటమైనగురుని, పీటాముజేరిన, నాటిదెలసికొని దాటారయ్యా, దాటించే, గురుపూజ యేటికి నూటికి, కోటిమందిసేవా జేసివలే దయ్యా ॥దాసోహం॥

4. యిలను చింతతోట, కలనుగన్నది పేట, తలవాకిలున్నది, తలచారయ్యా తలగొలుకువులు రెండు, కలసి తెలసితేను, యిలయందు యీ సత్తు, కల్లలై పోయింది, దాసోహం ॥దాసోహం॥

5. ఆశపాశములన్ని కోసి మోసముజేసి, నాసికాగ్రము మూసి చూడరయ్యా, యీసూని కృపవలను మోసమెన్నడు లేక, దాసులందు నీవాసులై యున్నారు ॥దాసోహం॥

6. వక్క నక్కావలెను పెక్కుజీవులుగల్గి చిక్కక దక్కక యున్నాదయ్యా, దక్కినవారికి చిక్కివిడిపోను. యుక్తివలన ముక్తి భక్తాలకెల్లాను ॥దాసోహం॥

7. స్థిరమాని నిరతాము, గురుపాదములు రెండు సిరసందు, నిలిపి తానుంచారయ, తరుగులేని పూర్ణభావమొందినవారు, పరమ పదవికిపుడు పాత్రులైయున్నారు ॥దాసోహం॥

8. దండిగురునిబట్టి అంటా జేరలేక, ముండాలువలె తాను యుండే రయ్యా అండపిండము లేక నిండియున్నది చూడు, ఖండఖండము గాను యుండిపోయినవారు ॥దాసోహం॥

9. నిర్వికల్పవరులు, సర్వాము తానని, యుర్వీలోపల త్వాలా యుందూరయ, మర్మము లేకను గురుపాదములు రెండు, సిరసను జేర్చి, పారము తరుగు లేనివారికి ॥దాసోహం॥

10. బోదాలొందినవారు, బాదాలుపడ లేక మేదీనిలోపల యుందురయ, హృదయను మందుగురుని వదలాక మదిలోను, పదిలపరచి గురుని బద్ధూలైయుందురు ॥దాసోహం॥

11. హంసాను దెలియాక, సంసారమనీయేటి, విసాలోబడి త్వాల యుందూరయా, హంసదంసమయ్యె, సంశయరహితులై, హంస లేక, పరమహంసలై యున్నారు ॥దాసోహం॥

12. సూతివద్దున కొంగ, స్వాతివానకు చిప్ప – యీ తీరుగను జ్ఞానులుందూరయా, కోతి నెత్తిపైని నీతిగూర్చున్నాది, నాతినెత్తిపైని నాదాము వినరండి ॥దాసోహం॥

13. సీమానిష్టలు లేక, నిలచీయున్నది యేదో, కామాంధకారులై కానరయ, రామనామమంత్రి రహస్యాము దెలసీస, కామ క్రోధములన్నీ కాలీపోయిన వెనుక ॥దాసోహం॥

14. యెండామావ్రులరీతి, యెండిపోయెను జగము, పుండరీకాక్షుని యెరుగారయ్యా, నిండు కుండలిలోను పండియున్నది చూడు పండు వెన్నెలలోను బ్రిబలీనవాడయ్య ॥దాసోహం॥

15. యీదర బొబ్బిలి రామమూర్తి గురుని పాదాము బట్టీన పాషడయ్యా వాదభేదమేది లేని ఖధళీపత్రి రాజియ్యదాసుని ప్రార్థన వినండి ॥దాసోహం॥



# యెంతపనీ

## 40. తత్వము

1. యెంతపనీ జేసినావుర, యీ వింతలంత సంతతమున వెంతపని జేసినావుర ॥యెంత॥

2 అంతరంగమూన నీవు, వింతలు గనుపరచినావు, మంతనమున కాంతలాతో, యీ వింతలు జేసినావు, పంతములాడాబోవు ॥యెంత॥

3. ఆడది మొగవాడు నీవని, జాడ తెలియలేరు యిలను, పాడుగుడికి జీవుడవని నాటికిని నిన్నూగన్న నేటికి నోమూసున్న ॥యెంత॥

4. సృష్టికి నీవు యిష్టుడవని, స్పష్టముగను నమ్మితిని, దృష్టసాక్షి రూపుడవై, అష్టప్రణవము నీవై, సృష్టంతా యేలితివని, ॥యెంత॥

5. మొట్టమొదట శృష్టిలేదు, శృష్టికి మహత్తులేదు, ఆష్టపాశ బాద్ధుడావు, కష్టముల్ పాల్ బడితివేర ॥యెంత॥

6. యెండమావులరీతి జగము, వుండిపోయిన మయుగములని, అండపిండ బ్రహ్మాండమంతట, ఖండా ఖండాముగాక, యుండినవాడెవడోయని, ॥యెంత॥

7. సరసులైనవారు యిలను, నిరతము గురుసేవ లెరిగి, తరుగులేని పరమ పదవి, నిరతము రాజయ్యదాసుడు, మరువక సేవించెనురా ॥యెంత॥



# అ ఖ ం డ

## 41. త త్వా వుం

1. అఖండ పూజలు పొందిన వారికి, సుఖంబనే పరమార్థమయా, సుఖంజేసి గురు పూజలు పొందిన సుఖం లేదు తన కేలనయా ॥అఖండ॥

2. దండి గురునిబోదందిన వారలు, పండితులైరి పరమాత్ములయ, కొండెములాడెడి, ముండలువలె తాతిండిపోతులై తిరిగెరయా, ॥అఖండ॥

3. నీమనిష్టలూ నిజమనుకొని, తన పామరత్వములు విడువర, యేమి లేని పరిపూర్ణమందు, తా నీమమ మక్కడ నిలువదయ ॥అఖండ॥

4. సాంఖ్యమంత పరిశోదన జేసిన నెంఖలన్ని విడిపోవునయ, అంకి తప్పకా లెక్కలు జూచిన, నెంకలని యిక అంకెలయ ॥అఖండ॥

5. తారకమును తన తత్వము దెలసిన, సారమునెనని తెలియరయా, కోరిక దీర్చె నీరజాక్షులని దూరము ప్రపంచ సహితమయా॥అఖండ॥

6. అమనస్కములో అతీతమిదియని, సమరాస మెరిగితె సాదులయా, నిర్మల మెరిగిన ఖర్మము లేదని, మర్మము దెలసితే జ్ఞానులయ ॥అఖండ॥

7. ద్వాదసి బావనమే, దీనిలోవల బాదలుదీర్చే బోదలయ, సాదులకు యాదారము యిది యని, నాదానందము లేనిదయ ॥అఖండ॥

8. పంచదశిని పరిశోధన జేసిన, యేంచితే సంచితమీడునయా, కించపరచి, గురునింద వహించిన, సంచిత మిడువక యుండరయ ॥అఖండ॥

9. దర్పణమును రూపంటక యున్నది, అర్పణ మేదో తెలియరయా, కర్పూరపు దీపమువలెను గురునకు అర్పణ రాజయ్యదాసుడయ ॥అఖండ॥



# తప్పిదములు

## 42. తత్వము

1. తప్పిదములు తీర్చుమని గొప్పగురుని వేడితిని తప్పులన్ని కాలిపోగా, నిప్పువంటి అచలమని, అప్పామాయప్ప నాతప్పులు దీర్చుమాని నోప్పొకుంటిని నేను చెప్పకతీరదు తప్పిదములు దీర్చుమని గొప్ప గురుని చేరితిని ॥తప్పిదములు॥

2. మంచి గురువులని నామనసెంచి మిమ్ము గాంచితిని, వంచనములు జేసిన మీ మంచితనము విడువనని, సంచితములుబోయె మించి పూర్ణిమిలో వంచాన జేసి నన్నుంచిన చాలును ॥తప్పిదములు॥

3. కోరిక, దీర్చెటి గురుని వరము నిమ్మని వేడితిని నీరజాక్షులనుచు నామది, కోరిగురుని జేరితిని దారాపుత్రాదూలు లేరాని మదిలోను, దూరాము జేసినా బారాము నీదాని ॥తప్పిదములు॥

4. పతితపావన గురువులని, పాతవుజేసి నమ్మితిని మతులు సున్నా గతులున్న, మొత్తము యాపత్తు నీకగ్తైయున్నవని ॥తప్పిదములు॥

5. రాక పోకలు లేని పూర్ణము, లోకాములో నిండెనని నీకు నాకు లేక అంతట నిండియున్న నిజమిదని, లేక గల్గిన జగము, కాలై వెల్గిన, యేకాము దెలసిన, లోకాము లేదాని ॥తప్పిదములు॥

6. చక్కని గురుబోధయికను, మక్కువతో దొరికెనని, చిక్కులన్ని తెగిన తుదను, ప్రక్కనే యున్నదిరన్న, వక్కా నక్కా నన్ను చిక్కులు పెట్టేను, నిక్కాము దెలసిన యెక్కాడలేదని ॥తప్పిదములు॥

7. హంసను దెలియాక నేను హింసలోనే యుంటినని, సంశయము వీడితేను, హంసలేక పోయెనని, హంసాదంసంబయ్యె, సంసాయ రహితులై హింసాలేక పరమ హంసాలై యున్నారు ॥తప్పిదములు॥

8. సోహమనేదానికి, యీ మోహము సంసారములు, ఆహో యీ తనువునకును-సోహమెటులు వచ్చెనని, సోహో మోహము రెండు ఆహంసవంచెయ్యె,సోహోము దెలసీన, మోహాం లేదాని॥తప్పిదములు॥

9. జగము నాల్గు యుగములని, పగలు నాల్గు జాములని, నిగమ వేద్యునిగనలేరు, మగువతో మాట్లాడలేరు, తగులు మిగులు నాల్గుయు మూలులేవాని, జగము నిండియున్న రాజియ్యదాసుడు-తప్పిదములు దీర్చుమని, గొప్ప గురుని వేడితిని ॥తప్పిదములు॥



# తానిల్లే

## 43. తత్వము

1. తానిల్లే తనవారిల్లే, తలవాకిలి నున్నది, తల్లీ పిల్లలు రెండు-లేనిల్లే తనవారిల్లే॥

2. యీనగాడు జీవుడై దోషమైయున్నాడు, జీవిడీసుడైన మోసాము లేకాను ॥తానిల్లే॥

3. దాసోహ మంటాడు, యీసుని యెరుగాడు, ఆశపాశములన్నీ కోసీన యీనగాడు ॥తానిల్లే॥

4. ముల్లోకములోకెల్ల మూలామైయున్నాడు, తలపుతా నేయని, తత్వమెరిగిన లేడు ॥తానిల్లే॥

5. తాను జీవుడైన, తత్వమిరువైయైదు, తన తత్వామారోది తన్ను గన్నాలేదు ॥తానిల్లే॥

6. అమనస్కా-తారకము గమని చి చూచిన, నీమనిష్టలు లేక, నిలచి యున్నది యేదో ॥తానిల్లే॥

7. యెరుక తానై యున్న, పరిపూర్ణమందూన, మరపు తెరపులు లేని, మార్గ మెరిగినాచాలు ॥తానిల్లే॥

8. దీపదూపములనే, అర్పణంబులు యెరిగి, రెపన్న మాటకూ రూపు లేదని యెరిగి ॥తనిల్లే॥

9 కర్పూరసిఖి రెండు కాలిపోయిన విధము–దర్పణం చేసిక, దయను గన్నా గురుడు ॥తానిల్లే॥



# పట్టండీ

## 44. తత్వము

1. పట్టండి పాముని కట్టండి, దాని కట్టీ చెంగులు రెండు దిట్టముగ ముడివేసి ॥పట్టండీ॥

2. ఘట్టీ సాద్గుగుని జేరి, గుట్టూగన్నట్టివారు, ముట్టే తన మూలమాని, పుట్టానున్నటి నాగుని ॥పట్టండీ॥

3. పుట్టకు తొమ్మిది తూట్లు, లొట్టలన్ని బిగియించి ముట్టూ అంటూ లేక, సృష్టికి మూలముదాన్ని ॥పట్టండీ॥

4. గురుపాదుకులు రెండు, గురుతూగన్నటివారు, నిరతము శ్రీవశా నందని, పూణూలై నటివారు ॥పట్టండీ॥

5. మనసూ తలపులు రెండు, యెనసీ పక్కటి జేసి, అనయము సోహము లోను, తను మనములు దారబోసి ॥పట్టండీ॥

6. దంట నాగస్వరము, బెంటబాయకనూది, అంటీ అంటిక పాము, ఇంట జేరియున్నదాన్ని ॥పట్టండీ॥

7. జోడు పక్షులు రెండు, కూడి యేకముజేసి, సాడీ నడివీధినున్న, కోడితాౢ్రిమని దాన్ని ॥పట్టండి॥

8. చుట్టూ సైకలు పుట్టా, గుట్టుగన్నా పుట్ట, నట్టనడుమను తట్ట - వట్టిదేర యీా బట్ట ॥పట్టండి॥

9. ధరనూ బొబ్బిలి వాస, పురము రాజియదాస, తిరుణమిదే నివాస, పరమాత్మనుసోస, పట్టండి పాముని కట్టండి, దానిదట్టీ చెంగులూ రెండు దిట్టముగా ముడివేసి ॥పట్టండి॥



# వుండబోవుం

## 45. తత్వాం

1. వుండబోము, మనముండబోము, కడాకుండబోము, యడబాయకే రాముని మరువక దలచిన, వుండబోము మనముండబోము, మన ముండబోము, కడాకుండబోము॥

2. దండిస్నానములు మెండుగజేసిన, నిండు సమాదిలో యుండినలేదు, అండపిండ బ్రహ్మాండమంతట నిండు పూర్ణమని, నిజమని దెలసిన, ॥వుండబోము॥

3. జపములు తపములు పువవాసంబులు, నిపుణులమని తానిలచిన లేదు, కపటములేకను, గురునకు అర్పణ, కర్పూరపునిఖ కాలిన విధమని ॥వుండబోము॥

4. దాసులమని, గురువాచనలేకను, కాషాయంబులు కట్టిన లేదా, దోషములన్ని నాశము జేసిన యీసుజేగురుడు నివాసము దెలసిన, వుండబోము మన ముండబోము యెడబాయక రాముని మరువక దలచిన ॥వుండబోము॥

5. గురుకూటములో మరుగులు దెలియక, గురునకు సేవలు జేసిన లేదు. యిరువుర తరుగులు యరుగులు లేకను, నిరతము పూర్ణానందము నొందిని ॥వుండబోము॥

6. బోదలు పొందిన బాధలు లేవని వాదించిన మది నెరుగక లేదు, నాదానందము మీమీదుగనున్నది, పాదు దెలసితే, బాదలు లేవని ॥వుండబోము॥

7. నీమనామములు నిజమని నమ్మిన, కామక్రోధములు కాల్చిన లేదు – నేమి లేని పరిపూర్ణంబంతట, నీమము లేకను నిలచియున్న యున్నదని ॥వుండబోము॥

8. మేడలో గురుతులు పెండుగ వేసిన, బూడిద మేనుకు బూసీన లేదు, పాడుగుజే తన బూడిదై యున్నది, మేడలోపలను మర్మము దెలసిన ॥వుండబోము॥

9. కపటాత్ములకిది, మటమని తెలియక, నటనలు యెరుగక నిలచిన లేదు, కపటము గురురాజయ్యకు అర్పణ మటమేయిదియ మర్మము దెలసిన, వుండబోము మన ముండబోము, యెడబాయక రాముని మరువక దలచిన ॥వుండబోము॥



# గురువర్యా

## 46. తత్వము

1. గురువర్యా నామాట పరదారి జూపండో, గురువర్యా నామాట పరదారి జూపండో, సరసనుయున్నా ముక్తికాంతకు, స్థావర మేదండో గురువర్యా నామాట ॥పరదారి॥

2. అండపిండ బ్రహ్మాండంబంతట నిండే యున్నదిర, నిండిన నిజగురు బోధలు పొందితే అందే యున్నదిర, గురుశిష్యానామాట నివు నమ్మియుండుమురా ॥పరదారి॥

3. మీకూ నాకు లేకున్న పరాత్పరు నిజమును తెలియదండో, ముఖ్యమైన పరమార్థం బిదియని మూళము దెలుపండో గురువర్యా నామాట ॥పరదారి॥

4. ఏకమైన పరవస్తువయందున లోకంబున్నదిర, లోకము రెండని ఏకంబాకటని, మూటిని దెలియుముర, గురుశిష్యానామాట నీవు నమ్మియుండర గురుశిష్యానామాట ॥పరదారి॥

5. అందము త్సందము లేకను యున్నా అతీతమేదండో, యీ సందేహము నాకిడి పొయ్యే యిక సాధనమేదండో, గురువర్యా నామాట ॥పరదారి॥

6. హృదయ కమలమున వదలక తనకడి, ముందే యున్నదిర, ఆ సందేహము విడనాడిన వారికి పొందే యున్నదిరా, గురుశిష్యా నామాట నివునమ్మియుండరా ॥గురుశిష్యా॥

7. పంచభూతములు మించియున్న పరిపూర్ణంబేదండో, యీ సంచితములు విడిపోయే కొంచము మార్గము జూపండో, గురువర్యా నామాట పరదారి జూపండో ॥గురువర్యా॥

8. తను మన ధనములు, గురునకు వినయము దారబోయ్యిపోరా, అనియము గురునకు వినయము తన మనసులో యుండుమురా, గురుశిష్యానామాట నివునమ్మి యుండరా ॥గురుశిష్యా॥

9. మనసులోను, మనసై యున్నపుడిక మార్గంబేదండో, మును నేనెరుగని అనయమునాలో, యున్నది చూపండో, గురువర్యా నామాట పరదారి చూపండో ॥గురువర్యా॥

10. అన్నది విన్నది కన్నది లేదని, వున్నది నిజమనరా, నన్ను నేను నేనెరిగిన రాజయ్యదాసుని వాక్యామురా, గురుశిష్యా నామాట నివునమ్మియుండరా ॥గురుశిష్యా॥



# అంతటను

## 47. తత్వము

1. అంతటను నిండేసని, మంతనము యిదేనని, కొంతమందికీ తెలియదు, సంతతము గురుని, చెంత జేరినట్టి వారికే ॥అంతటను॥

2. కృతయుగమున నందు విష్ణు త్రేతయుగమందు రామ సీతా రామాంజనేయులు, పొందిన బోద, పొందినవారికందును॥అంతటను॥

3 ద్వాపరమందు కృష్ణా, యీ భోద రుక్మిణికి, దాపునున్నది జూపెను ప్రపాయముతో రూపు లేదని జెప్పెను ॥అంతటను॥

4. యుద్ధవుని పాద్మములు - ముందు సేవించెనని సిద్ధారైవెలా గొండెను, శ్రీదరులుగన్నా రద్దూ పాపించమానిరి ॥అంతటను॥

5. శ్రీధరులు శిష్యుడని, యాదరా సివరామ దీక్షితార్యులు యిలలో,
బోధాదికార మొందిన మేదినీలోను ॥అంతట॥

6. నూటికి కోటికి యీ నూటు దెలసినవారు–దాటియున్న వారందరు,
కూటమున జేరి, నూటు దెలియకాను జెడుదురు ॥అంతటను॥

7. కలియుగమునందు యిది, కల్లయని నమ్మిని, కలకాలములు కల్లని,
యిల యందు పూర్ణమూళమని నీకు జెప్పెను ॥అంతటను॥

8. యిప్పుడిది శిష్యులకు మెప్పుగను బోదనిచ్చి తప్పునని జనన మరణము
కర్పూర సిఖని, అర్పణము గురునకిమ్మని ॥అంతటను॥

9. పట్టుకాయిల గురుని పట్టి తింటినాయిల తేనె పట్టు, కొంటి తనము
చేత, కంటిని అంటియాకుల రాజియ్యదాసుడానుయ ॥అంతటను॥



# మొంతకనం

## 48. తత్వం

1. మొంతకను నేవిన్నవింతూనూ, యీ మంతనంబున కాంతలకు
పెత్తనములాయెను – సంతతము గురు చెంత జేరక, అంతరాత్మని
తెలియనేరక యింతులను గూడంగ, రతిపురతులు సలుపుచు
నుందురెప్పుడు, మొంతకని నేవిన్నవింతూనూ యీ మంతనంబున
కాంతలకు పెత్తనము లాయెను ॥మొంతకను॥

2. పెద్దలను దూషించపనాకిరీ, ముద్దిడుకొడుకులు బుద్ధి తెలియక గుద్దు
లాడిరీ, వద్దనున్నది తెలియనేరక, మొద్దువలె మోదిరించి, తిరిగేరు,
రిద్దు ప్రపంచమును నిజమని,వద్దనున్నది వదలుకున్నారు॥అంతటను॥

3. నీతివాక్యములాడి తిరిగేరూ, యీ మంతనంబున, నాతివలపుల యందు జిక్కేగు – కోతివలె తన వింతలన్నియు, ఖ్యాతియనుకొని, జెప్పచుందురు, మాతి తనలో యున్న దెరుగక, మోహిత దెలియరు భూతలంబున ॥మెంతకను॥

4. సతులు సుతులు హాతులు స్నేహితులు – యీ మంతనంబున, మతులుచెడి తన హితునిగోరేరు, అతుకుబ్రతుకని మతిని దెలియక సతతము గురు చెంత జేరక, హితులు వెంబడి తిరిగె, వెధవుల గతికి మూళము తెలియబోరక ॥మెంతకను॥

5 ధరను బొబ్బిలీ పురము నీవాసం, యీ మంతనంబున, గురుడు దెల్పిన వాక్యమే శాస్త్రం, యిరుగు తరుగులు లేని రాజియదాసు గురువుని జేరినందుకు, మరుగు జూపిన రామమూర్తిని, మరువక జపియించు చుంటిని ॥మెంతకను॥



## ఆ పు ర ము

## 49. త త్వ ము

1. ఆపురమూ సంపదలు కాపురమురా, యేపులేక వెలుగు చున్నదీ, నాపురమురా, ఆపురము సంపదలు కాపురాముర, దాపున యున్నది యేడ, తప్పక దానిని జూడ, చూపుల కిటికీల్ జోడ రూపు లేని మూవాడ ॥అపురము॥

2. తానేవు పుట్టుగు లేని స్థలమూనాపురముర, ఆపురము సంపదాలు కాపురాముర, నీవ్వూ నీలో చూడు, రావుయెన్నటికైన–పోవూను ఖర్మాలు, దూరావు నీలోను ॥ఆపురము॥

3. యేమిలేక వెలుగు చున్నది నాపురాముర, ఆ పురమూ సంపదలు కాపురాముర నమ్మిన వారికి సొమ్ము నమ్మని వారికి దుమ్ము, దిమ్మలారా నామాట నమ్మితే నిజమానమ్మ ॥ఆపురము॥

4. పతన మెన్నడు లేనిది అది నాపురాముర ఆపురము సంపదలు రేపురాముర, రుతువులేని మావాడ, పతనములేదూ చూడ, సత్యమున్నది మొత్తము – నిండినవాడ ॥ఆపురము॥

5. కోపతాపమూలులేని, నాపురంబుర ఆ పురము సంపదలు కాపురాముర, కాపరి బొబ్బిలివాడ, నాపైనున్నది మేడదాపున రాజియ్య తప్పక వానిని జూడ, ఆ పురము సంపదలు కాపురాముర యేపులేక వెలుగు చున్నది నాపురాముర ॥అపురము॥



## రమ్మాని

## 50. తత్వము

1. రమ్మానినా గురుడు నమ్మియున్నవాని ఏమ్మాని చెప్పను న్యాయాగామా, నమ్మియున్న గురు మర్మము జూపక, సొమ్ము నా కెట్లవును దేశిక ॥రమ్మాని॥

2. చెపలత్వా ముడిగితే, వుపదేశమొంది, నీ జపమొందుకే నీకు నిత్యకదాపున్నది జూపి, యేపులేదని జెప్పి చూపు సల్పవే జీవరత్నమా ॥రమ్మాని॥

3. నన్ను నేనెరుగాక నిన్ను నేనడిగితిని వున్నదని చెప్పక న్యాయమూ, తిన్ను గనినవారు ధన్యులై యుందురని ముందు నివు చెప్పితివి దేశిక ॥రమ్మాని॥

4. గుసువు శిష్యులు రెండు గుసుతొక్కటై, నేనుకు మరుగెక్కడున్నాది
శిష్యకా, తిరుగు యిరుగులు లేని పరముకిది త్రోవని, స్థిరబుద్ధి
నొందావె రత్నమా ॥రమ్మాని॥

5. పరము బ్రహ్మంబని, బ్రహ్మమె పరమని మరుగు జూపించాక
న్యాయమా, గురువు నీవై యున్న గురుతూ లేకున్నట్టి, మరుగు
జూపించుమీ దేశక ॥రమ్మాని॥

6. సందేహ వందనము రెండు విడనాడి నీముందూ యున్నది జూడు
శిష్యకా. యెందు జూచిన సందు లేకను యున్నది జూడు సందేహ
మొందకే రత్నమా ॥రమ్మాని॥

7. చూపుచే తన్ను జూచిన వారికి, రూపులేకున్నది న్యాయమా,
పాపపుణ్యముచేత పాపినేనైతిని, ఆపదలు తొలగించు దేశక
॥రమ్మాని॥

8. తొలి వుపదేశములు మళ్లీ జెప్పినగాని కల్లయనుకున్నావు శిష్యక,
పొల్లు దంచిన బియ్యమెన్నాళ్లు చెరిగీనా పొల్లు యెగిరినరీతి
రత్నమా ॥రమ్మాని॥

9. నన్ను గన్నవారు నాయన్నలైతేను, నన్ను విడిచేతురు న్యాయము,
కన్న గురువులు నన్ను మన్నించి యీ త్రోవ జూపి పర మొందించు
దేశక ॥రమ్మాని॥

10. ముప్పు తప్పులు దేరే గొప్ప బోదలు నీకు వొప్పి చెప్పితిని శిష్యాకా,
తెప్పలు రెండు మెప్పులని తిరిగేవు తప్పించుకో జీవరత్నమా
॥రమ్మాని॥

11. తిప్పు ఒప్పులు గురుని కర్పూరంబని, నన్ను ఆదరించక నీకు
న్యాయమా, కర్పూరశిఖి రెండు కాలిపోయిన విధము తప్పులు
తొలియించు దేశక ॥రమ్మాని॥

12. సుందర బొబ్బిలి, శ్రీధర రాజయ్యదాసు గురువుని జేరు శిష్యాకా,
భేదాభేదము లేని బోధ నీకిచ్చేను, మోదమందవే జీవరత్నమా
॥రమ్మాని॥



# పల్కవేమే

## 51. తత్వము

1. పల్కవేమే, ఆత్మనాతో అల్కలెందుకే, అల్కు పల్కు చిల్కు లేదు, పల్కుచున్నది, తేనెలొల్కు, నలువు తెలుపు-నీలమధ్య, నిల్కడెరిగి, పల్కుచుంటివి, పల్కవేమే ఆత్మనాతో ॥అల్కలెందుకే॥

2. యేడుగడచి, మూటికావల, జోడు పక్షులు గూడి కోటలో, పాడుచున్నది పరమహంసను, గూడినా నిజపదవి దొరుకును॥పల్కవేమే॥

3. మనసు మర్మమెరిగి మదిని, తను మనములుదీర గురుని, అనయము గురు ఆత్తలోను, మనసు నిలిపి యుంచెచాలును, పల్కవేమే ఆత్మనాతో ॥అల్కలెందుకే॥

4. నాదినీదని భేదమెందక, యేదిలేదని మోదమొందిన, వాదమేది లేదు, నాదాతీతమె నిజగురుని మహిమ—పల్కవేమే, ఆత్మనాతో ॥అల్కలెందుకే॥

5. పూర్తిగురు కటాక్షమొంది, శూన్యమైన ఆత్మనిలిపి తన్ను మరచి కేవలాత్మతీతుడై, రాజయ్యదాసుడు పల్కవేమే, ఆత్మనాతో ॥అల్కలెందుకే॥



## అందదుగా

## 52. తత్త్వము

1. అందదుగా తన నిజమేదో, అందరికెది అనుభవమైనది మదికందదుర తన నిజమేదో.

2. నిర్వికారుడట, నిరంజనుండట, సర్వభూతములూ సాక్షియట మర్మ మెరుంగని మాయా గురువులు, యెరిగించెదమని యెట్లనియెదరో ॥అందదుగా॥

3. యంత్రముగాదట తంత్రముగాదట, కొంతమందికిదీ, మంత్రమట మంత్రము తంత్రముగా యెంత్రము యెరుగక, యెరిగించెదమని యెట్లనియెదరో ॥అందదుగా॥

4. పరిపూర్ణంబట, యెరుక లేనిదట, యెరిగించిన సాద్గురుడుగలండట, మరుపు, యెరపు రెండెరుగని గురువులు – యెరిగించెదమని యట్లని యెదరో ॥అందదుగా॥

5. పుట్టదు గిట్టదట, నిష్టలు లేనిదట, నష్టము యెన్నడు గానిదట – పుట్టుగిట్టు రెండెరుగని గురువులు – యెరిగించెదమని యట్లని యెదరో ॥అందదుగా॥

6. అందదు పొందదట, పొందిక లేనిదట, సుందరులకు అదీ అందునటా, బంధము విడువని మాయా గురువులు, యెరిగించెదమని యెట్లని యెదరో ॥అందదుగా॥

7. జ్ఞానముగాదట జ్ఞానముగాదట, సజ్జానులకదీ సూచనట, జ్ఞానా జ్ఞానము యెరుగని గురువులు, యెరిగించెదమని యెట్లనియెదరో ॥అందదుగా॥

8. దాపున యున్నదట, చూపునకందదట – చూపరులై తే జూచునట
చూపులోను లోచూపు యెరుగక, చూపించెదమని యెట్లని
యెదరో ॥అందదుగా॥

9. గురువులు శిష్యులట, గురుకూటంబట, తరుగులేని పరిపూర్ణులట,
పూర్ణాత్పూర్ణాము యెరిగిన పిమ్మట మరుగు యిదేయని రాజయ
దాసుడు ॥అందదుగా॥



# అంతటా

## 53. తత్వమం

1. అంతాట దిశలందు, ఆవరించిన పరమాత్మ యెక్కడ యున్నాడే,
సంతాత మొకరీతి, చింతా లేమియు లేక, చెంతానున్నది తెలియవే,
అంతరంగుడు ఆత్మనాత్మకతీతుడై లో వెలిసి దిరుగుచు –
స్వాంతావైని స్తేమున అనంతరూపుడే తెలియ మనసా –
॥అంతాట॥

2. కాయాను మాయామై, పోయ్యేటప్పుడు పరమాత్మ యెక్క డ
యున్నాడే, హాయిగా పరమాత్మ కాయామేమియు లేక, ఏమ
జగమని తెలియావే, కాయమే మాయనుచు మదిలో హాయిగను,
పరమాత్మ అంతట, మాయచేత నమర్మాము నుగని బాయకుండవే
మాయమనసా ॥అంతాట॥

3. త్సత్తుచిత్తులుగాని, నిత్యాము అంతట, సత్తమెక్కడ నున్నదే,
సత్యాములోపలా త్సత్తూచిత్తులు రెండు, నిత్యాము మది నమ్మావే,
వృత్తదీ బయలనుచు మదిలో, సత్యమని నమ్మినవారికి చిత్తు
జీవుడ నిత్యుడని, తాసత్యమని నమ్మావె మనసా ॥అంతాట॥

సృష్టిపుట్టకముందు దెృష్ట లేని జగము-యట్లాగు సృష్టోచ్చేనే, ముట్టు ముూళము లేని ముట్టాని యనియేరు సృష్టి అట్లని తెలియవే, పుట్టు గిట్టులు లేని బ్రహ్మము, పుట్టదని నీమదిని నమ్మము, వట్టి మాయా ప్రపంచ మని నీగుట్టు దెలియదె, మాయ మనసా ॥అంతాట॥

నాలో నీలోయున్న నిజమేదో, తెలియక పాలుమాలకయుంటివే, జాలాము కాలాము మూలాము లేనెరుక, వాలాలాడుచునున్నాదే, కల్లయీజగమెల్ల సున్నది, యుల్లమున పొల్లనుచు మదిలో, త్నల్లదరచిన వెన్నవలె, నీయుల్లము తరచంగ దేలును ॥అంతాట॥

యేమూగాడచి కాడమేడాలోపలనున్న వాడెవ్వడో యెరుగక, చూడుపాడుచునున్నవాడె సోహంబ్రహ్మ, నాటకదారుడని మూడు గుణములు విడచి తనలో జోడు పక్షులు, గూడి కూటమి - జాడదెలసినవాడె గురుడని కూడియుండవె మాయ మనస ॥అంతాట॥

కాలాకాలముకల్లా కాలాముయనీనా, మూలామేదో తెలియదే, కలియాక తెలియాదు, కల్లాజగములన్ని కాలిపోవును తెలియావే కీలుగుగుడని, చాలనమ్మిన మేలు పొందిన వాడవైతే, మూల మేవోగన్న రాజయ్యదాసు నేలిన చాలు మనసా ॥అంతాట॥



# ఓన్నమన్నివా

## 54. తత్వము

ఓన్నమస్సివా ఐదక్షరములతో ఆరంభమాయెనే వుయ్యాలో, రక్షకుడు చిన్మయుడు తొట్టిలోపల తాను వుగుచూనున్నదే వుయ్యాలో ॥ఓన్నమన్నివా॥

2. పంచాక్షరీ మంత్రిపటియించినా వారి సంచితము తొలగునే వుయ్యాలో, మెంచి విపక్షురాల్ మించి ప్రాణములోను, అడచూనున్నడే వుయ్యాలో ॥ఓన్నమన్నివా॥

3. మన్ను మిన్నూ నీరు అగ్నిలో నాలుగూ కొల్లగాపించనే వుయ్యాలో మనసులో సోహము రెండు మెరసి గట్టిగ గట్టి, తొట్ట గావించనే వుయ్యాలో ॥ఓన్నమన్నివా॥

4. అండపిండము రెండు ఆత్మట్టు యీాత్మట్టు ఉండుగావించేసే వుయ్యాలో, వుండచూచిన గురుడు నిండు సామాదిలో, సాగుచూనున్నాడే వుయ్యాలో ॥ఓన్నమన్నివా॥

5. యెరుపూ తెలుపూ నలుపు పచ్చపసుపులు మీాద పవ్వలించున్నాడే వుయ్యాలో, మరపు తెరుపులు రెండు, నిరుపమానిసమైన మెకతానన్నాడే వుయ్యాలో ॥ఓన్నమన్నివా॥

6. జాగ్రితా శ్వప్నసూసుప్తి మూటిని గూడి - సాత్మ్మసై వున్నడే వుయ్యాలో, తుర్యామునకాతీత నిర్వికారములోను, తన్నమరచున్నాడె వుయ్యాలో ॥ఓన్నమన్నివా॥

7. నిర్మలంబైనట్టి ఖర్మజీవుల కెల్ల, కారణంబైనాడు వుయ్యాలో, ధర్మ ఖర్మలు లేక నిర్మలాత్ముడు ప్రభుడు సర్వము తానాయెను, వుయ్యాలో ॥ఓన్నమన్నివా॥

8. యిట్టి మర్మముగన్న, ఘట్టిగనులెవరైన, పట్టునేమో బోధ వుయ్యాలో, వుట్టిలోపల చట్టి, చట్టిలోపల పాలు, పాలలో వెన్నవలె వుయ్యాలో ॥ఓన్నమన్నివా॥

9. తరచ తరచక వెన్న తేలిపోయినా వెనుక, తరచంగ నేలనే వుయ్యాలో, మరుగు యెరిగిన గురుని దారిజేర రాజయ్యదాసు శ్రమదీరెనే వుయ్యాలో ॥ఓన్నమన్నివా॥



# అక్కారో వినవేయి

## 55. తత్త్వం

అక్కారో వినవేయి బొక్కా మొక్కడు నూతి కెక్కియున్న కాదాను
మక్కువగల్గి మక్కు చిక్కులు నిండేను, వక్కా దాని యందు
పెక్కు జీవులుగల్గ - నెక్కాడెక్కడ తానై, పిక్కటిల్లుచు
నున్న, భక్తిగను గురు దృక్కు తెలియక, చిక్కు మాయను బొక్కి
యుండిరి, కక్కసులకిది దక్కదని, పెంపెక్కు నార్యులు నొక్కి
చెప్పిరె ॥అక్కారో॥

తనువానిత్యంబౌన, తనతో గల్గిన జగము తలపాన నిత్యాముగా,
ధనధాన్యసంపతుల నృత్యంబాయెగా మునుజనులీది, గనలేక
భ్రమ నెంచగా, గాఢాస్వప్నమును వీడి, జనుజాగ్రితనుగాను,
గొను నావారలు మరలా గనుగోన లేరిహాము - అవయ మొకరీతిని
తెలుసిననని, సనకసాదులు బల్కిరి, వినుము గురుచే గనినవారలు
జననమరణాంబుధిని గడతురు ॥అక్కారో॥

గురుభక్తియును విడసి గురు గోప్యమును దెలసి, గురునీ సంతతము
గొలచి గురునీ చేగూడి - గోపార్థమును వడసి, గురువాజ్ఞలో
గూరరూ తీరాముగా నిలచి యరమర లేకిపుడు యార్యుల చెంతాను,
నిరతా శ్రీవణానంద నిపుణూలైన సద్గురు, కరుణతో త్రివిధ
దీక్షలుగొని, తరుగు లేకను గురుని పదములు - మరుగు జేరియు,
పరము గనినను, బారమయుగ సంస్మరణ మెప్పుడు ॥అక్కారో॥

పంచాభూతంబులు మించి వెల్గె జ్యోతి, పొంచి పొంచి గాంచీనా,
సంచితామడంచి యెంచి జూచీనా. వంచనామూలద్రుంచి చెంచల
మడచీన, కాంచనాదులు కల్లాటంబు తనలో తెలసి యుంచు
కంతయు భ్రమానుంచాక. పరమాత్మ పంచవన్నెలు మీరి
యున్నది, చెంచలులకది గానరానిది, యెంచిగురు కారుణ్య
మొందిన మంచివాల్కి కాంచనగునది ॥అక్కారో॥

5. షోడాషడ్ చక్రముల జోడూ బాయక యుండి, కూడియున్న జాడాగా, యారిటికీ పై మేడాలోపల యుండగా జాడగనిన, వారె ప్రత్యాఘాత్మగా, మేడ జూచిన వాడే, తోడూ నీడై యుండు మూడూ యేకంబైనా మూలామిడేయుసి, చూడచూడగ కీడు తొలుగును – గాఢనిద్రయు తోడు మెలగును – పీడ నుండిన తానె వెటగును – మూడలకు కడు గూఢమైచను ॥అక్కారో॥

6. అష్టాతనువులుగాక, అష్టాత్ములనూగాక, సప్తాలేమియు లేకను – శ్రేష్టంబైన, అష్టామూర్తులుగాకను, అష్టాంగములు–అష్టాదిక్కులు గాకాను, అష్టాపురంబులు, అష్టామదంబులు స్వస్తిలయంబులు, సప్తామేమియు లేక, అష్టదళ మద్యాంబు నందున స్పష్టముగ యమల ప్రకసితము, నిష్టలేకను వెలుగులోపల, అష్టసిద్ధులు ఆంటాకున్నది ॥అక్కారో॥

7. రాకా పోకలు లేక యేకారీతిగ తన్ నిరాకారామై యున్నది, భూతాంశము యేకాలమున లేనిదీ, తత్వరూపాలోకములను గానిది, పాకాటముగ నెన్ని పరిఘటిసి సాగనీ. ఏకస్వరూపం కానున్నది, జూడు జూడ శ్రీ గురు కరుణ గల్గిన పిమ్మట తెలియందగును గురుసాజ్ఞచే గాక యితర సభ్యాసములచే, కాదు కాదెన్నటికి తెలియుదు ॥అక్కారో॥

8. సురులాలో నరులాలో గిరిలాలో ధరులాలో జెరులాలో హరులాలో జూడగదె, చరాచరులాలో తరులాలోను – దేహాధరధరమూలో వారిలోను, మురిలో వారిలో చారులో నారులో, నీరులో పారులో, పోరులో పారామార్థికములో లేరులేరుగ లేక తానై మీరి యున్నది, గోరువారికి, చేరి నిజగురుదారి తెలసినవారు పుడమికి, రారుమరలను ॥అక్కారో॥

9. జగమూలజననాము, యగణీతమును దెలియనగునె బ్రహ్మేంద్రులకు
యీగతిగలిగె ననుట - నవ్వులచేటూకు, సాగరము దీనంతు
దెలియుటకు, యుగయుగములు పుట్టే తగు వెందూపోయేనో
తనుపాటి గుహూజేరి, భుగులు దీసుకొనిన, ముగియకను ముగియింపు
చున్నది, యెగిని దెలియన సాధ్యమైనది, తగిన వారికి వగపనగునది
తనిన ఆప్యల బోద సుమ్మది ॥అక్కారో॥

10 నీటి యందున కెరటన్ని తాటి యందునా పాము బాటా యందు
మోసుగా రవి కిరణను ధాటినట్టి తారకముగా, పాటిలు శశికి
సాటి. కొమ్ముల రీతిగా, సాటిగల వంధ్యాసుతుని గన్నట్టి,
బ్రాంతితో యీ జాగామా మెగ, తేట తెల్లము యెరుక,
నాటకంబని యెంసు, యిది ముమ్మాట్రికిని పొరపాటులేకను దాటి
నిజగురు కరుణ జెందిన, తేటపశు సంశయము లేదిక ॥అక్కారో॥

11. మూలాము లేకాను, వాలాయముగ తానై మేలై వామలాడుచు-
కీలెరిగిన, తానై వెలిపోవుచు - నాటు కాలమాలై మారిపోవుచు
ఘాతిల నెరిసిన యోకాలమునను, సీలో వెలుపలు నుండి, యేటి
గానుండి, చాలుచాలని వెలి పరమును - మాలగ గురుని చేగని,
మూలమూలేని దే, దేహామని కాలమొక రీతియును గడుపుచు
॥అక్కారో॥

12. ద్వాదశినోడసి పాదు దెలసి నీవ్వూ, భాదలన్నియు పీడావే, ఆదీ
అంత్యామేదిగాకను యుండవే, వాదాబేధగాదా నెడబాయవే,
మేదనీలోపాల, వేదావేద్యునిపాద, వ్యాదిమాగాడరు, యారాదన
శాయవే, మాది మీదని, భేదమెదక, సూడిమోపను సందు లేకను,
పాదుకొని బ్రహ్మంమంతట బ్రిబలు చున్నది. పరమ గురుతిద
॥అక్కారో॥

13. గురుభక్తి వీడ్కాక గురువాక్య మరువక. గురుపూజలను జేయుచు గురునకు దీపధూప, గంధము నొసగుచు మరువక, పత్రిపుష్పాక్షింతలు నిడుచూచు - గళము నవకుశ జాజిమాలిక నిడుచూచు-సరలీ తాంబూల దక్షిణ లొసగి-సద్భక్తి కరమూన సిరిపాదమురి భుజంబుగ సహాగ ధరను మోపగ దండమిడి, ప్రదక్షిణంబులొనర్చి, గురునకు కరము వేడి నభయ మొసగును తరుగులేని పరము జేర్చును ॥అక్కా॥

14. ఆకారముగ సాంప్రదాయాక లక్ష్మణ-నీకు దెల్పితి వినవే, లోకమున, ప్రఖ్యాతత ప్రభలునీవె, యేకాలమూ లేకా తానై యున్నదే, నీనాకు సంకేతము దెల్పునీవే, ప్రాకాటమూ మళ్లీ పెద్దికృష్ణబ్రహ్మ రాకాపోకాలు లేని రాజమార్గము దెల్ప, జోకతో తిరునగరి, కృష్ణులు యేకమిదియని యూహ జేసియు.మూకతనురై మైనచోటును, కాకినీకంబై వెలుంగుచు ॥అక్కా॥

15. దీరూతాకృష్ణ దేశక చెంత, పరమార్ధదారి యిది యని దెలసీన, తిరుమణిలేటి కోటయార్యులు దరలోన, పరిపూర్ణుతా వారి భక్తాలకు దెల్పెను మరువక వాటు స్థిరచిత్తులై యుండి యిరుగూ తరుగూలేని, పరబాయసిదీయని మరుగుజేరి, మహాత్మోన్మరిన గురువార్యులు విరివిగను కాంతేటి నీరయ గురుపురార్యుల మరుగు జేరియు నిరతమును రాజయ్యదాసునిమ్మది బల్కు వాక్యము ॥అక్కా॥



# మంగళ హారతి

## 56. తత్వము

1. అంగానులంతా గూడి, బంగారుపీఠముపైని సృంగారించిన గురునకు, మంగాళం, మంగళామని అంగానులంతా గూడిరి అంగాలింగములు, భంగామైనాయని వేడిరి, అంగాలింగములు లేవని, లింగమే భంగమని, అంగాను సిరసుల పైని, మంగాళం మంగాళం మని, లింగాభంగామే జెప్పిరి, శ్రీగురురామములు, మంగాళమాని యానీరి ॥మంగాళ॥

2. పాపిద్దాన నిద్దురుగొని, గురువద్ద పాదములు ముద్దునుద్దాలేరిగిన వారికి, మంగాళం – మంగాళామాని బుద్దులు చెప్పి పంపిరి, అద్వైతాములో, రద్దు–ప్రపంచాము మానిరి, సుద్దూ లెరిగీన గూరు వద్దా నుంతూరెల్లపుడు, వోద్ద కెరిగీన వారికి, మంగాళం మంగాళ మాని, ద్వైతా ద్వైతాము యిదియాని, కుద్దూగ మీాకు దిద్దీ తీర్చి జెప్పితిని.

3. భక్తీయుక్తూలు లేని ముక్తూలుగలుగవాని, ముక్తీచే గురునీగన్న మంగాళం మంగాళమాని, ముక్తికి మూళము దెలియర, భక్తి యుక్తులు నిశ్చాయమని నమ్మీయుండరా, నీకూ నాకూ లేకను యేకామై గురూపాదము లేకాగల్గిన వారికి మంగాళం మంగాళ మాని, రాకానిరాకారంబాని, సాకారములో లేకాగల్గిన జగమానీ॥

4. సన్నాబీలాములోను యున్నవారెవ్వరనిన, మొన్నానే గన్నవారికి, మంగాళం, మంగాళమాని నున్నా జన్మాముమానీన, గన్నావారికి, అన్నాది లేదూయానీన మొన్నానన్నా గన్నవారే మెన్నో యుక్తూలు పన్ని, నన్నూగూడ, నావారికి మంగళం మంగాళామాని, గన్నావారికి నున్నాని, నన్నూటికి యెవరో కన్నా గూరూని జేరిరి॥

5. బోదాలొందినవారికి, బాదాలెవెందూనైన, వాదాములుడిగే వారికి, మంగాళం మంగాళామాని, బాదాలు తిరేనా నీరి, నాదీ నీదన్న బేదాము లేక పోయిరి వాదాబేదాము లేకను మోదామై యున్నాదాని, సాదూసజ్జానులకు మంగాళం మంగాళామాని, గాదాలు తీరే బోదాలు, మేదీని నన్నూగూడనపోను ఖర్మాలు॥

6. ముప్పూతప్పాలులేని, గొప్పసాదనమిదాని, తప్పాలు దీర్చె, గురునకు మంగాళం మంగాళామాని వొప్పశావాలు జేసిరి, తప్పూ వొప్పూలు, తప్పించునన్ని, వేడిరి చిప్పాచినుగులూ, రెండూ గొప్పానదిలోను మునిగి, చిప్పాకు తెలియక ముత్యే మంగాళం మంగాళమాని చెప్పాకపోయిన నీను నిప్పుప్పి నిప్పురు గప్పిన చంద మానాని॥

7. సారా సంసారములోను, ఘోరఖర్మాములన్ని; వారాదు తిన గురునకు, మంగళం మంగళమాని, మీరాగురువుం యాజ్ఞకు, దారాపుత్రూలు, లేరని మదిని గోరాకు, కోరక దీర్చె గురుని, జేరి గురుశేవాలన్ని, దారి జూపిన గురునకు, మంగాళా మంగాళం మంగళమాని సారా సంసారము తెలియర ఘోరాఖర్మాలు దూరలు యానినమ్మరా॥

8. అండాపిండములన్ని నింపూ పూర్ణములోన ఖండాఖండాముగాను మంగళం మంగళమాని, యుండిపోయిన వెనుకను, అఖండాముగ నింపి, పరిపూర్ణముండెను, దండిగ గురుష్వాను బట్టి, అండాబయక మెప్పుడు, యుండా జూపీన గురునకు మంగళం మంగళమాని, అండాపిండాము లేవని యుండినా చంతి నింపూ పరిపూర్ణఖిదిర॥

9. విత్తూలేకాను చెట్టు పాస్తూ పరచిన దెవరో, నిత్యాము గురిని సేవ, మంగళం మంగళామాని, త్సత్తే చిత్తినా దెరుగారు మత్తూలకెల్ల, నిత్యాము సేవలొందాగు, సత్యామని నవిర్మా గురుని, నిత్యాము రాజియ్యబాసు త్సత్తేగురుపాదామాని మంగళం మంగళమాని, నిత్యసేవాలు జేశాను మొత్తామీదంతా, త్సత్తేచిత్తయునదాను॥



# మంగళ హారతి

## 57. తత్వము

1. అందాము గురుపాదమందూ శిష్యుని శిరసందూ నిల్పిన గూరు వర్యానాకు, వందానామయ్య నాచందాము జెప్పినా, సుందారులని మిమ్మా జెందేమున్వామి, మంగళం మంగళం మాహానుభావ ॥మంగళం॥

2. సృష్టీ లేదని నాకూ, మొట్టా మొదట జెప్పి, యిష్టాపడితి నేను సృష్టా మొంది, అష్టైశ్వర్యామునిష్టామనినమ్మ్యాన, యిష్టాపడినా వారి కష్టా మెక్కడిదీ ॥మంగళం॥

3. అంగాలింగము రెంకు – సంగాము తానాని, లింగ మెప్పటికైనా భంగమని, రంగైన మేడలో పొంగీతరంగామై, గంగా యెమునుల మధ్య లింగామైనావు ॥మంగళం॥

4. చత్తూచిత్తూలు రెంకు, నిత్యామనుకున్నాది, మోత్తామిదంతా యీావు త్తదాని, చిత్తు జీవుడు తాను, చత్తు పరమాత్మని, సత్యాము దెలపి అనిత్యాము స్వామి ॥మంగళం॥

5. లోకాలోకములన్ని యేకామైన వాని, సాకారమూ వోక పాకాముగా, లేక గల్గిన జగామూకాలై వెల్గిన, యేకాము దెలసీతే లోక మెక్కడిది ॥మంగళం॥

6. ఏమెన్నినోన్ని జన్మాము లొచ్చిపోయినగాని, పన్నాబీలమూలో యున్నవాస, మొన్నరాత్రివేళ, నిన్ను గన్నందుకు అన్నావారూ లేక సున్నామెస్వామి ॥మంగళం॥

7. సాకారమూలో నిరాకారమైయున్న, ఆకారము లేక నేకామని రాకపోకలు లేక, లేక గల్గిన జగదారూడవై నీవు, దీరుడై నావో ॥మంగళం॥

8. గురువు శిష్యులు రెండు గురుతొక్కటే జేసి, మరుగు వీడినపాని మార్గమాని, సరగూన వైకుంఠపురమూకు జేరే యీ మార్గంబు దప్పితే మరిలేదు స్వామి ॥మంగళం॥

9. విరివిగ బొబ్బిలి పురమందు వెలసిన, దరరామమూర్తి శ్రీ పాదామూన, మరువాక గురుపాదసిరసందు ధరియించి, ధర రాజియ్యదాసు దండములు స్వామి ॥మంగళం॥



## మంగళ హారతి

## 58. తత్వము

1. హారతూ లివ్వారే గురునకు, మేరు సమానాధీరులని దారి జూపిన ధీరులని మిము జేరితిమి పరదారిదేయని ॥హారతూ॥

2. దండిగా భూమండలంబున, నిండినా నిజగురువులని, అండాము పిండామూ లేదని, ఖండన జేసి అఖండులని ॥హారతూ॥

3. కోరినా మిము జేరినందుకు, దారిజూపిన దాతలని, నారదాది మునీంద్రులందరు జేరి మిము కొనియాడిరని ॥హారతూ॥

4. ఆశపాశామూలుదోసి, కోసి మిము జేరితిమి-దాసదాసాదాసూడనై తద్దాసుడనై, మిము జేరితిమి ॥హారతూ॥

5. మీ సుదర్శన దాసులకు సే, మోసమెన్నడు, లేదురుని, వాసనా భవపాశములు యిడదీసే గురువుని జేరినామని ॥హారతూ॥

6. నాటికీ మీనాపాటినాగలు, నేటికైనా దొరుకరనీ, పాటమైనా సూటు యిదియని, దాటించే నిజగురువులని ॥హారతూ॥

7. స్పష్టముగ యీ సృష్టేలేదని, మొట్టమొదటే జెప్పిరని, యిష్టా యిష్టము లేకను, అంతట స్పష్టముగా పరిపూర్ణులని ॥హారతూ॥

8. పాటమూ గురుకూటము, మునుమ్మాటికై విడనాడము – నూటికీ కూటికి గురువై, దాటించె నిజగురువులని ॥హారతూ॥

9. దీపులై బొబ్బిలి పురమున కోరినా నిజగురులనీ దారిగన్నా రాజయ బాసుకు నేరములు యిక లేవ్వయని ॥హారతూ॥



# కాయపుర వర్ణన ప్రారంభం

## 59. తత్వము

1. చరణం: యెంతో వింతై యున్నాదీ కాయాపుర మెంతో బాగై యున్నాది యెంతో వింతై యన్నాదెంతాని యెంతూను, వంతూ కెక్కిన భగవంతూని పురమీాది, యెంతో వింతై యున్నాదీ కామీాపురము యెంతో బాగై యున్నాది.

మూాలాముగానాది, కాలామునందుండి వాలాయముగా నాన వాలూగాను, చాల దేసుక మోగ, శాలై విలసిల్లు మోాలూ, బళాబాళమెలు, మేలునా మంచి కోట, పట్నపు యోజానాలు, అందున అద్భూతాలు, కోటలు ప్రిహారీలు, తొమ్మిది దర్వాజేలు, పారాలు చేకీలు, కావలి జావానూలు, లోపల మంచి మేలు, దివ్యపు భావానాలు, చక్కని కట్టడలు, మిక్కిలి సౌదామూలు, టొక్కపు స్తంబామూలు, డెబ్బది రెండూ వేలు, గాలీగోపూరాలు–

దేవాలయామూలు, మకరాతోరాణాలు సింహాతలాటాలు కుండలి
స్నానామూలు, అచ్చట దైనాయాలు, మహింతా భూజాములు,
పక్షుల పంజారాలు, మాయామృగామూలు, చక్కని వాసారాలు-
వచ్చేటి వస్త్రావ్రాలు, నిచ్చేటి మంచివలు, పొయ్యేటి సరుక్కజాలు-
ఖర్చుకు అంగడిలు, తిరిగేటి సంగడీలు, యెర్రని రత్నామూలు
తెల్లని బిందూవులు నల్లనినీలామూలు, పచ్చని వజ్రాలు-నాలుగు
రత్నామూలు, చర్మపుకుప్యాసాలు, మిక్కిలి వేమూశాలు యెక్కువ
సగతాత్రిమూలు, ఎక్కువ నారామూలు, దిక్కుల క్లేశామూలు-
ధర్మపునాడాకాగా-మర్మపుగేహాయాలు, మిక్కలి సహోయ్యాగాలు,
మతాలు, దీపాంతిరమూలు, కూశటియోపాదాలు, కారాళ్లు,
అంగూళ్లాల్లు గరాళ్లతో, యెంతో వింతైయున్నద కాయాపురము
ఎంతో బాగై యున్నాది.

2. చరణం: శ్రీరమ్యాయుగమాయాదారీ ప్రారంభన వరాశ నత్మ
విచారముగ, దరతముగ పెద్దా పెరీజయందూస భేరీమృదంగలతో.
రాత్రిపగలోకతీరు, తత్వములనె బాను, చోరుల మంచేవారు
ద్వారము ముందూవారు-జ్ఞానేంద్రియములతీరు, ఖర్మేంద్రియమల
వారు-యీ పనములబూరు పెయ్యముల సాగారు, ఖర్మాల
కోతారు, కాయకమూలా పేరు. దుర్గుణమూలపోరు, యేసిసు
లప్టాబారుగుగ్రాలా కాలరు రథాల సవ్వారు-లోకమాగుతారు
తంబుల యొక్క తీరు-కానీపూసేబూరు, అంబుల యొక్క జోరు
సంగము నిబ్రాగోరు-చూచేటి బల్సమసారు నదులును మూడు
వారు- కోలనుల యంమ నీరు, నీరము నందున్నారు, పద్మము
లొక్క తీరు, తీరమునందూవారు వారల యొక్క పేరు పసుకుతిగ్గ
వారు-వాణికిరూపూతీరు, ఒక్కటి బెల్గుడారు, అచ్చనిగయొక్క
యొక్కతీరు, కోల్వున ప్రిబూవారు, సరసను అమ్మావారు,
తానెదార్లు, యిద్దరు గస్త్రీవారు-తొమ్మిది కాపూవారు, మిక్కిలి
గుంపూవారు, వెరిక్కడు పారిచారు అక్కడ సాభావారు, బాయక
మూనిషికాసు పరిచారు, తయ్యారు కచేరిలో, యెంతో వింతై
యున్నాది కాయాపురము యెంతో బాగై యున్నది.

౩.చరణం వేడుక మూడిట కుండలి మధ్యను వాడపీటికి యానాడగను
చూడచూడగ ఉన్నాడో లేడో రాత్రి క్రీడ సల్పెటి పెద్దవాడో,
లేకను చిన్నావాడో, ఉన్నది చూడాబోడు, యెన్నడు బుట్టినాడు,
యెప్పుడు చావాబోడు. వచ్చెటి వాడూకాడు టక్కులమాయా
కాడు చొక్కపు బేరాగాడు యెవ్వరికందాబోడు ఎక్కడాజూడా
వాడు బూచులయేకీమీాడు, మాయల వన్నెకాడు, నిర్బలు
గన్నాడు మండలమేలువాడు పాపాలా హుజూడు పన్యులకెలా
తోడు అన్నటకీనీజోడు వక్కటిగా యున్నాడు, వుండియు లేనీవాడు
లేకనుయున్నావాడు చూడగ పంటివాడు, వానికి దోడ్డపీడు,
వీడుకి దోడావాడు.



# మంగళం స్వయం ప్రకాశ

## మంగళ హారతి 60

1. మంగళం స్వయం ప్రకాశ లింగాభంగం నిర్వికాశ సంగరహిత సర్వప్రకాశము బంగములేకున్నా, శ్రీమంగళ ప్రభూనాకు ॥మంగళం॥

2. సృష్టిపుట్టక ముందు నీవని, యెట్టిలేక నిండినావని అష్టాదళము నీది సత్తాని,స్పష్టముగా యిలయందున నష్టము లేకున్నావని ॥మంగళం॥

3. నిర్వికల్పసమాది నీవని, యుర్విలోపల నిండీనావని, సర్వపాప హరణమని, నిర్వాహించిన చాలు, సర్వము నీదె సత్తని ॥మంగళం॥

4. కంటికి గోచరుడవని, దంటబాయకా యున్నావని, మింటికీ మూలమునీవని, కంటికి మింటికి నంటక, దట్టముగా పూర్ణుడవని ॥మంగళం॥

5. వాసిగా బొబ్బిలీలోను, మోసములేకున్న గురుని ఆశలురోసి గురునిసేవ, జేసితినే, పాదము నేనమ్మిన రాజియదాసుడ ॥మంగళం॥

